# మాతృవందనం

వేదవ్యాసుని "వాయుపురాణం"లోని 16 శ్లోకాలకు
శ్రీ బాపు చిత్రాలు - శ్రీ చాగంటి వ్యాఖ్యానం



# మాతృవందనం

( వేదవ్యాసుని "వాయుపురాణం"లోని 16 శ్లోకాలు)

చిత్రలేఖనం

శ్రీ బాపు

వ్యాఖ్యానం

'బ్రహ్మశ్రీ' చాగంటి కోటేశ్వరరావు



**Mathruvandanam**

ప్రతులు : 2000

ప్రథమ ప్రచురణ: జనవరి 2015

ప్రచురణ కర్త : **జయంతి చారిటబుల్ ఫౌండేషన్**
Subbarao Jayanthi
28 W 260 Belleau Dr
Winfield, IL-60190, U.S.A.
jaysubbu2@comcast.net

Cover & Illustrations : **బాపు**
Layout: T. Naveen, Design: G. Rajesh
Printed at: Sree Kalanjali Graphics, Hyd.

Our Sincere Thanks to:
Sri Bapu- Sri Ramana
Sri Chaganti Koteswara Rao
Sri KI Varaprasad Reddy

Image courtesy:
GMR-Varalakshmi Foundation
With due acknowledge to GMR Varalaxmi Foundation for Bapu Illustration’s and Shlokas from ‘Ammapadam’

Content Courtesy:
Shantha-Vasantha Trust, Hyd.

వెల : అమూల్యం

# పరిచయమే అక్కరలేనిది - అమ్మ



"అమ్మ" - పరిచయమక్కరలేని ఏకైక వ్యక్తి, పదం. సృష్టికర్తగా, స్థితి కర్తగా, ప్రళయ కర్తగా (నిద్రపుచ్చుతోంది కనుక) ఆమె పరబ్రహ్మ స్వరూపిణి, పితృఋణాన్ని తీర్చుకోవచ్చు కానీ, మాతృ ఋణం తీర్చుకోవడం సాధ్యం కాదని శాస్త్రవాక్కు.

"అమ్మ" - ఓదార్పు, ధైర్యం, అప్యాయత, ప్రేమ మరియు ఆశీస్సుల కలబోత. అట్టి అమ్మతనానికి శ్లోకరూప పట్టాభిషేకమే "మాతృషోడశి". ప్రతి శ్లోకానికి "బాపు"గారు గీసిన బొమ్మలు మనసుని ఆర్ద్రతతో నింపేస్తాయి.

ఈ శ్లోకాలను హృద్యమైన తాత్పర్యంతో, బాపుగారి బొమ్మలతో, నా వ్యాఖ్యానంతో గ్రంథరూపంలో తేవడానికి శ్రీ వరప్రసాద్ రెడ్డి గారు చేస్తున్న యీ ప్రయత్నం పరమ సంతోషదాయకం.

శ్రీ వరప్రసాద్ గారు సహజంగా మాతృ, పితృ భక్తి పరాయణులు.

ఈ పుస్తకాన్ని చదవడం, సంస్కారాన్ని పెంచి, మనిషి - మనిషిగా బ్రతకటానికి మార్గం సుగమం చేస్తుందనడం నిస్సందేహం.

ఈశ్వరానుగ్రహంతో శ్రీ వరప్రసాద్ గారు మరిన్ని సత్కార్యాలు చేయాలని ఆశిస్తూ...

కాకినాడ<br>28 జూన్14

బుధజన విధేయుడు<br>చాగంటి కోటేశ్వర శర్మ

# అమ్మపదం



**కీ॥ శే॥ శ్రీమతి సీతామహాలక్ష్మి**

అమ్మ... ఒక అపురూప శబ్దం. పుడుతూనే బిడ్డ స్పష్టంగా వెలువరించే ధ్వని 'అ'. ఓంకారం కూడా అకారం తోనే మొదలువుతుంది. పశువుల అంబారవంలోనూ 'అ' వున్నది. ఏ భాషలో నైనా అమ్మను సూచించే శబ్దాలు, చిన్న చిన్న తేడాలతో, మన 'అమ్మ'కు రూపాంతరాలుగానే వున్నాయి. అంటే అమ్మకు, అమ్మతనానికి దేశ, కాల అవధులు లేవు ; అమ్మ విషయంలో అస్తి నాస్తి విచికిత్సకు తావూ లేదు.

అవాస్తవాలకూ, అతిశయోక్తులకూ, ఆలంకారికతకు కూడా అస్కారం లేని పాలకడలి అమ్మ!

మన భారతీయ జీవితంలో, సాంస్కృతిక జీవనంలో అమ్మది దివ్యస్థానం. అమ్మది పరమేశ్వరీ స్థానం. అందుకనే పరమేశ్వరిని 'అమ్మ' అంటాం.

ఏ పని చేసినా సమాజానికి ఉపయోగపడాలని చిన్నప్పట్నించి మా అమ్మ చెబుతుండేది. చదువు పూర్తికాగానే ఉద్యోగం చేస్తానంటే వ్యాపారం చేయమని ధైర్యం చెప్పి, ప్రేరణ కలిగించినది అమ్మ. ఆర్థికంగా, రాజకీయంగా ఎవరి అండ లేకపోయినా ఈ స్థాయికి వచ్చానంటే అమ్మ అండదండలు, ఆశీర్వచనాలే కారణం.

అమ్మమీది అభిమానం, వాత్సల్యంతో అమ్మకు స్మృతిగా 'అమ్మపదం' అనే పుస్తకానికి రూపకల్పన చేయించాను. మా వ్యవస్థలోని సాహితీ స్పర్శకలిగిన మేధావుల సహకారంతో 'బాపు'గారి చేత 'వాయుపురాణం'లోని శ్లోకాలకు చిత్రాలను గీయించి వాటిని 'అమ్మపదం' పుస్తకంలో పొందుపరిచాను. ఇవి తల్లిబిడ్డల మధ్య ఉన్నా బంధానికి అత్యున్నత విశ్లేషణగా పాఠకుల మదిలో నిలిచిపోతాయి. ఈ చిత్రాలే 'మాతృవందనం' పుస్తకానికి స్ఫూర్తి కావడం నాకు ఆనందదాయకం

భవదీయుడు

గ్రంథి మల్లికార్జున రావు

## తల్లీ నిన్ను దలంచి...



అమ్మ గురించి భారతీయ ఆర్షధర్మం ఎంత అద్భుతంగా చెప్పిందో... అమ్మ గురించి బాపుగారూ అంత గొప్పగానే బొమ్మ కట్టారు!

వాయుపురాణాంతర్గత శ్లోకాలకి ఆయన గీసిన బొమ్మలు కుంచెతోగాక.... హృదయంతో గీసినట్టున్నాయ్.

... మనకి గోరుముద్దలు తినిపించిన కన్నతల్లికి మనం పిండ ప్రదానం ఎందుకు చెయ్యాలి అన్న సంగతిని గుండెని పిండేలా... చిత్రించారు!

ఈ అమ్మ బొమ్మల పుస్తకాన్ని కళ్లు తడవకుండ తిప్పడం అసాధ్యం (మానవాతీతులకు తప్ప...)

ఈ అద్భుతాన్ని ఆవిష్కరించిన వరప్రసాద్ గారి మాతృమూర్తి శాంతమ్మగారు పుణ్యాత్మురాలు....!

వరప్రసాద్ ధన్యులు.

| | |
|---|---|
| హైదరాబాద్ | భవదీయుడు |
| 7 ఆగష్టు 14 | తనికెళ్ల భరణి |

## జన్మనివ్వడమే కాదు జన్మంతా యిస్తూ వుండేదే - అమ్మ



మన భారతీయ సంస్కృతి మొత్తం మాతృసంస్కృతి
నదులను స్త్రీమూర్తిగా, మాతగా పూజిస్తాం!
గోవును గోమాతగా కొలుస్తాం!
భూమిని భూమాతగా కీర్తిస్తాం
మన దేశాన్ని భరతమాతగా ఆరాధిస్తాం
మాతృమూర్తిలోనే యీ సకల చరాచరసృష్టి యావత్తు సృష్టింపబడింది.

'అమ్మ' - ప్రతి శిశువు నోటి వెంట వచ్చే తొలి పలుకు
ఈ రెండక్షరాలు అమృతబిందువులు - ఆత్మీయతా సింధువులు
అమ్మకు నిండైన నిర్వచనం -
- పగలూ రాత్రీ అనక, విశ్రమించక కన్నవారికోసం పరిశ్రమించే ప్రాణి యంత్రం.
హృదయంతో ఎవ్వరూ మాట్లాడలేరు - ఒక్క అమ్మతప్ప !

అమ్మది షరతుల్లేని ప్రేమ -
అమ్మది ప్రతిఫలం ఆశించని సేవ -
గర్భస్థశిశువుకు తన ఊపిరి, తన ఆహారం పంచే త్యాగం -
పొత్తిళ్లలోని పాపకు తన స్తన్యమిచ్చి జీవం పోసే దేవత

తొలిగోరు ముద్దలు తినిపించి కడుపు చల్లపరుస్తుంది
తొలిపలుకులు నేర్పించి, పలికించి మనసు వికసింపచేస్తుంది

సహనానికి భూదేవి - వాత్సల్యానికి ఆకాశం - సేద తీరడానికి వేసవి వెన్నెల
అమ్మంటే ఓ తరంగం - నిరంతర ప్రవాహం - నిత్య పరిమళం
అమ్మంటే పచ్చగా పండి ఒరిగిన చేను
అమ్మంటే నిండుగా పండిన రసాల మామిడి తోట

అమ్మంటే పోతన 'మందార మకరందం'
అమ్మంటే కృష్ణశాస్త్రి 'కవితా కల్హారం'
అమ్మంటే నారాయణరెడ్డి 'రసరమ్య గీతం'

నిజానికి అవేవీ దీటు రావు అమ్మకు -
అమ్మలాంటిది ఎవరంటే ఒకే ఒక్కఅమ్మే! అంతే!
అమ్మకు ఋణం తీర్చుకోలేము -
అమ్మకు అమ్మైపుడితే తప్ప !
అమ్మకు జేజేలు !

హైదరాబాద్ భవదీయుడు

1 ఆగష్టు 14 వరప్రసాద్ రెడ్డి



గర్భస్య ధారణే దుఃఖం విషమే భూమి వర్త్మని
తస్య నిష్క్రమణార్థాయ మాతృపిండం దదామ్యహం

గర్భం ధరించడమే దుఃఖం. దానికి తోడు ఎగుడుదిగుడు నేలమీద నడవడం అంతకన్న కష్టం. ఆ కష్టం సహించినందుకు ప్రతిగా ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను

గర్భిణిది ఒక రకమైన కష్టం కాదు, నెలలు గడిచిన కొద్దీ ఆమె రూపు మారిపోతుంది, శరీరం భారమవుతుంది, స్నానం, పానం, వస్త్రధారణ అన్నీ అవస్థలతో కూడుకున్నవే. పండగైనా, ఉత్సవం జరిగినా యింట్లో అందరూ బయటకు వెళ్లినపుడు ఆమె ఒక్కతె యింట్లో వుండిపోతుంది. పడుకోవడానికి కూడా అవస్థ పడుతుంది. అడుగు తీసి అడుగు వేయడం కష్టం. మెట్లు ఎక్కలేదు, దిగలేదు. నేల ఎగుడు దిగుడుగా వుందేమో, కంటకావృతంగా వుందేమో, శిలామయంగా వుందేమో, నాచుతో పాకుడుపట్టి వుందేమో, తను జారిపడితే కడుపులోని శిశువుకి ఏమైనా అవుతుందేమోనన్న భయంతో ఆమె చూసుకుని చూసుకుని నడవాలి. కానీ ఎత్తయిన కడుపు కారణంగా ఆమెకు భూమి కనబడదు.

'అమ్మా, నీవు నాకోసం అటువంటి కష్టం పడ్డావు. అసలు గర్భం ధరించడమంటేనే మనుగడకే ముప్పు తెచ్చుకున్నట్లు...! భూమిపై నడిచేటప్పుడు మరింత కష్టం. నాకోసం అవన్నీ సహించిన తల్లీ, నీవు దేవుడితో సమానం' అని చెప్తూ శిశువు పాదాభివందనం చేస్తున్నట్లు బాపు గీశారు. ఆమె కాలికున్న మట్టెలు, మంజీరాలు ఆమె సౌభాగ్యత్వాన్ని, చుట్టూ వున్న పద్మాలు లక్ష్మీత్వాన్ని సూచిస్తున్నాయి.

గుడిలోని దేవత మన కోసం మాతృమూర్తిగా నడిచివస్తోంది. ఆమె మార్గంలో కొండలున్నాయి, రాళ్లున్నాయి. అయినా మనకోసం దిగి వస్తోంది. ఒక జీవి గత జన్మల పాపాలను ప్రక్షాళన చేసుకుని సత్కార్యాలు చేయడానికి యీ జన్మలో తల్లి కడుపున పుడతాడు. అతని పాలిట అది గర్భాలయమే.



యావత్ పుత్రోన భవతి, తావత్ మాతృశ్చ చింతనం
తస్య నిష్క్రమణార్థాయ మాతృపిండం దదామ్యహం

కొడుకు కలిగేదాక తల్లి చింతతో బాధపడుతుంది.
అటువంటి చింత కలిగించినందుకు ప్రతిగా
ఈ మాతృపిండాన్ని నీకు సమర్పిస్తున్నాను

బిడ్డ ఎలా పుట్టినా తల్లికి సమ్మతమే. వికలాంగుడైనా, బుద్ధిమాంద్యం కలవాడైనా లోకానికి అంతటికీ బరువుగా తోచినా తల్లికి మాత్రం భారం కాదు. వాడెలా బతుకుతాడోనని జీవితాంతం చింతిస్తుంది. బిడ్డ ప్రయోజకుడై మణులు, మాన్యాలు సంపాదించినా తల్లి ఏమీ కోరదు. వాడు ఆరోగ్యంగా, సంతోషంగా వుంటే చాలనుకుని తృప్తి పడుతుంది.

'అమ్మా, పుట్టింట్లో నిన్ను అల్లారుముద్దుగా పెంచారు. అత్తింట్లో కూడా నువ్వు అందరికీ ప్రేమాస్పదురాలివే. అందరి మన్ననలూ పొందినదానివే. అయినా కేవలం సంతానం కలగలేదన్న కారణంగా నువ్వు దుఃఖించావు. పిల్లలు పుడితేనే జన్మ సార్థక్యం అనుకున్నావు. నేను ఎటువంటి వాడినో, నా గుణం ఎటువంటిదో నీకు తెలియదు. అయినా నాకోసం పరితపించావు. నేను బయటకు రాక ఏడిపించాను. క్షమించమ్మా' అనే భావాన్ని వ్యక్తీకరించడానికి బాపు శిశువు తల్లిని ఓదారుస్తున్నట్లుగా చిత్రీకరించారు.

అంతేకాదు, ఆ తల్లి చింతను అద్భుతంగా చిత్రీకరించారు. శోకకారణం లోపల వుంది కాబట్టి ఆమె పెద్దపెద్ద కళ్లను కిందకు వాల్చి అశ్రుబిందువులను రాలుస్తోంది. జుట్టు పాయ మొహంపై పడుతోంది. నిజానికి కన్నీళ్లు తుడవాల్సింది భర్త, తలిదండ్రులు, అత్తమామలు. కానీ యిక్కడ శిశువు చేత ఆ పని చేయిస్తున్నారు బాపు.

ఆ తుడవడంలో కూడా ఆమె చిబుకాన్ని ఒక చేత పట్టి, మరొక చేతి వేళ్లతో ఆమె బుగ్గలు రాస్తున్నాడు. శిశువు చేతులకు మాత్రమే యిక్కడ ప్రాధాన్యత. మొహం లేదు. ఆ మొహం నాది, మీది, అందరిదీ..!



మాసి మాసి కృతం కష్టం వేదనా ప్రసవేషుచ
తస్యా నిష్క్రమణార్థాయ, మాతృపిండం దదమ్యహం ||
ప్రసవ పర్యంతం నెలనెలా కష్టం కలిగించినందుకు
ప్రతిగా ఈ మాతృపిండాన్ని నీకు సమర్పిస్తున్నాను

ఐదవ నెల దాటిన తర్వాత నుండి తల్లి విన్న విషయాలన్నీ కడుపులో బిడ్డ గ్రహించి సంస్కారాన్ని అలవర్చుకుంటాడు. అప్పుడు నేర్చిన సంస్కారమే అతని జీవనయానానికి చుక్కానిగా మారుతుంది. సత్కార్యాలు చేసి శివసాయుజ్యం పొందగలిగే సద్బుద్ధిని ప్రసాదిస్తుంది. బిడ్డకు ఆ సంస్కారం అలవడడానికి ఆమె ఓపిక లేకపోయినా పురాణశ్రవణానికి వెళుతుంది. నెలలు నిండిన కొద్దీ శ్రమకు ఓర్వలేక యింట్లో వుండిపోయినా మంచి విషయాలు వింటుంది.

మాసాలు నిండుతున్న కొద్దీ పొట్ట బరువు పెరుగుతుంది. గరిమనాభి స్థానం మారి విపరీతమైన నడుం నొప్పి కలుగుతుంది. దాన్ని నివారించడానికి ఆమె భుజాలు వెనక్కి విరిచి నడుముకు ఆసరాగా నిలుపుతుంది. బాధను ఓర్చుకోవడానికి ముఖాన్ని పైకెత్తుతుంది.

పురుషుడైన బాపు గర్భిణి శరీరంలోకి పరకాయప్రవేశం చేసి, ఆ భావాన్ని ఆవాహన చేసుకుని తన కుంచెలో బంధించారు. శ్రమతో, స్వేదంతో తడిసిన ఆమె జుట్టు పాయ కళ్లమీదుగా చెంపలమీదకు పడుతూంటే చూసినవారు సైతం సహానుభూతి పొందుతారు.

'అమ్మా, నెలలు దాటుతున్నపుడు క్లేశం అనుభవిస్తూ మృత్యువు నీడలోకి చేరావు. నీ ప్రాణాన్ని నిలబెట్టవలసిన నేను లోపల ఏ స్థితిలో వున్నానో, నా రూపురేఖలు ఎలా వున్నాయో నీకు తెలియకపోయినా నాకోసం యింత కష్టాన్ని అనుభవించావు. తలకిందులుగా తపస్సు చేసినా నేను నీ ఋణాన్ని తీర్చుకోగలనా అమ్మా' అని శిశువు ప్రార్థించినట్లు చిత్రీకరించారు.



సంపూర్ణే దశమే మాసి అత్యంతం మాతృపీడనం
తస్య నిష్క్రమణార్థాయ మాతృపిండం దదామ్యహం ||

పది నెలలు నిండిన తర్వాత, తల్లివైన నీకు ఎక్కువ కష్టం
కలిగించినందుకు ప్రతిగా ఈ మాతృపిండం
నీకు సమర్పిస్తున్నాను

పదవ నెల వచ్చేటప్పటికి తల్లి పడే పరివేదన వర్ణనాతీతం. అయినా ఆమెకు వంశాంకురం ఎదుగుతున్నాడన్న సంతోషం లోలోపల కలుగుతూంటుంది. బాధ, సంతోషం రెండూ మొహంలో కదలాడుతూండగా పూర్ణగర్భిణి వీపు ఏ గోడకో, ఏ చెక్కకో వాల్చి, గుండెలను వెనక్కి కడుపును ముందుకు నెట్టి కటిక నేలపై కూర్చోవడాన్ని వైద్యులు 'మాతృత్వపుశోభ' (ప్రైడ్ ఆఫ్ మదర్‌హుడ్) గా వర్ణిస్తారు.

ఆమె పాదాలు రెండూ ఒక చోట చేర్చి కూర్చోలేదు. అందువలన ఒక కాలు చాచి, మరొక కాలును అస్తవ్యస్తంగా వుంచుకుని ఉపశాంతి పొందుతుంది. ఆ భంగిమను బాపు అద్భుతంగా పట్టుకున్నారు. కుడిచేతిని ఆసరాగా చేసుకుని, ఎడమచేతితో కడుపు నిమురుకుంటూ, తనివితీరా చూసుకుంటూన్న తల్లి పాదాలకు శిశువు నమస్కరిస్తున్నాడు. శృంగేరిలో యిటువంటి విగ్రహమే వుంది. పరమశివుడు ఒక కాలు చాచి కూర్చుని వుండగా నందీశ్వరుడు మనుష్యరూపంలో ఆయన పాదాన్ని రెండు చేతులా పట్టుకుని కళ్ల కద్దుకుంటూ వుంటాడు.

బాపు యిక్కడో చమత్కారం చేశారు. పరికించి చూస్తే పిల్లవాడు తల్లి పాదంపై తలవాల్చి పడుకున్నట్టు తోస్తుంది. పిల్లవాడు తన చుట్టూ తిరుగుతూంటేనే తల్లికి శాంతి, అమ్మను తాకుతూ, ఆమె చీరచెంగుతో ఆడుకుంటూ వుంటే పిల్లవాడికి ప్రశాంతి. అమ్మ స్పర్శే కాదు, ఆమె కట్టివిడిచిన చీరలతో కుట్టిన బొంతపై పడుక్కున్నా మనసుకెంతో హాయి. ఈ బొమ్మ చూడగానే బాల్యంలో మా అమ్మ మెట్టెలు నా నుదుటిని నొక్కుతుండగా ఆమె పాదాలపై నిద్రించిన ఘట్టం గుర్తుకు వచ్చింది.



పాదాభ్యాం తాడయేత్ పుత్రః జనన్యాః పరివేదనం
తస్య నిష్క్రమణార్థాయ, మాతృపిండం దదామ్యహం

తల్లివైన నీకు కష్టం కలుగుతుందన్న ఆలోచన లేక,
గర్భంలో ఉన్నప్పుడూ, బయటపడిన తర్వాత కూడా
కాళ్లతో తన్నినందుకు ప్రతిగా నీకు ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను

అమ్మ కంటె పూజనీయమైనది లేదు. కానీ కడుపులోని బిడ్డ చేసేదేమిటి? తన్నడం! లోకంలో ఎవరి చేతనైనా తన్నులు తింటే అవమానంగా భావించి జీవితాంతం బాధపడతాం. కానీ తల్లి యీ తాపులకు పులకిస్తుంది. బిడ్డ తనకు సత్కారం చేసినట్టు భావిస్తుంది. చిరుప్రాణికి గర్భాలయంలో ఆశ్రయమిస్తే ప్రతిగా వాడు యిచ్చే బహుమతి యిదా? అని ఫిర్యాదు చేయదు. గొప్పగా, గర్వంగా తన తల్లికి చెప్పుకుంటుంది.

ఇరుకు ప్రదేశం కాబట్టి అటుయిటు కదిలేందుకు అవకాశం లేక కడుపులో వుండగా తన్నాడనుకుని సరిపెట్టుకున్నా, బయటకు వచ్చాక మాత్రం తన్నలేదా? పాలు తాగుతూనే గుండెల్ని తంతాడు. ఆమె పరమపవిత్రంగా ఎంచే మంగళసూత్రం పట్టుకుని ఆటలాడాడు. తల్లి కోపం తెచ్చుకుందా? లేదే! ఆ పాదాల్ని, చేతుల్ని ముద్దాడింది. అడుగులు వేయడం రాగానే పరిగెట్టుకుని వచ్చి దబ్బున మీద పడితే చీదరించుకుందా? అబ్బే!

పిల్లవాడు కాలితో తన్నుతూ వుంటే మురిపెంగా చూసుకుంటున్న తల్లి చిత్రాన్ని బాపు కొద్దిగా పైకెత్తిన మోముతో (బాధతో వున్నపుడు ఎత్తినంత పైకి కాదు, గమనించండి) నొక్కిపెట్టిన పెదాలతో, ఉబికిన బుగ్గలతో ఆస్వాదిస్తున్న దృశ్యం అపూర్వం. తన చేతులతో ఒక అపురూపమైన వస్తువునో, పూలపొట్లాన్నో పట్టుకున్నంత సున్నితంగా బిడ్డను పట్టుకుంది. పిల్లవాడి తాపుల ద్వారా పొందుతున్న అనుభూతిని మెదడులో నిక్షిప్తం చేసుకోవడానికి కాబోలు మూసుకున్న ఆమె కనుల సోయగం సౌందర్యలహరే కదా! ఈ దృశ్యం చూసినపుడు అమ్మ మన పట్ల చూపిన ఔదార్యం గుర్తుకు వచ్చి కళ్లు చెమరుస్తాయి.



శైథిల్యం ప్రసవే ప్రాప్తే, మాతా విందతి దుష్కరం
తస్యా నిష్క్రమణార్థాయ, మాతృపిండం దదామ్యహం

ప్రసవం అయిన దగ్గరనుండి చిక్కి శల్యమైపోయినా
నాకు ఎన్నో సేవలు చెయ్యవలసి వచ్చింది. అందుకు ప్రతిగా
ఈ మాతృపిండం నీకు సమర్పిస్తున్నను

ప్రసవమంటేనే పునర్జన్మ. తర్వాత మాత్రం విశ్రాంతి వుంటుందా? 'బెడ్ రెస్ట్' అనే మాట తల్లికి ఎప్పుడూ అన్వయించదు. నవజాత శిశువు రాత్రి నిదురించడు. ఉత్తిపుణ్యానికి ఏడుస్తాడు. వేరే ఎవరెత్తుకున్నా ఊరడిల్లడు. తల్లి స్పర్శ తప్ప వేరెవరిదీ అంగీకరించడు. తల్లికి రాత్రి నిద్ర వుండదు. తట్టుకునేందుకు ఒంట్లో శక్తి వుండదు.

ప్రసవంలో నెత్తురు చాలా పోతుంది. శరీరం శిథిలమై పోతుంది. గర్భాశయం సాధారణ పరిమాణానికి చేరేవరకు కోలుకోదు. తనకు యిష్టమైనవి, తన ఆరోగ్యానికి కావలసినవి సేవించలేదు. తనేదైనా తింటే తన పాలు తాగే బిడ్డకు పడదేమోనని భయం. బిడ్డకు రోగం వస్తే తల్లి పథ్యం చేయాలి.

కావాలనుకున్నా తల్లి తినలేదు, గారాబం చేసి పెట్టినా బిడ్డ తినడు. బతిమాలగా నాలుగు ముద్దలు తింటే తన కడుపు నిండినంత సంతోషం తల్లికి. నిరంతరం వాడి ధ్యాసే. నిద్రలో కూడా మంచం నుండి బిడ్డ ఎక్కడ దొర్లిపడతాడోనన్న బెంగతో మీద చేయి వేసి కాపాడుకుంటూ వుంటుంది.

సదా రక్షించే ఆ తల్లిని బాపు తన బొమ్మలో ఆవిష్కరించారు. అరచేతులను భరిణగా చేసి, వేళ్లను వంచి నిద్రిస్తున్న శిశువుపై యీగ సైతం వాలకుండా భద్రంగా చూసుకుంటున్న ఆ అమ్మ ఆరోగ్యం ఎంత క్షీణించిందో గాజుల ద్వారా సూచించారు. ఎడమ చేతికి వుండవలసిన రెండు గాజుల్లో ఒకటి ఆమె చిక్కిపోవడం వలన జారి పడిపోయింది. ఈ బొమ్మ చూడగానే అమ్మ చేత్తో ఏదైనా తినాలని, తల నిమిరించుకోవాలని అనిపించడంలో ఆశ్చర్యం ఏముంది?



అగ్నినా శోషయేద్దేహం, త్రిరాత్రో పోషణం చయత్
తస్యానిష్క్రమణార్థాయ మాతృపిండం దదామ్యహం

మరణం తర్వాత 3 రాత్రులు దేహం అగ్నిలో శోషిస్తుంది
ఆహారం లేక. అందుకు ప్రతిగా నీకు
ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను

శరీరత్యాగం చేసిన తర్వాత అగ్నిసంస్కారం జరుగుతుంది. సనాతనధర్మం ప్రకారం ప్రధాన ఆరాధ్యదైవం అగ్నిదేవుడు. బ్రతికి వున్నంతకాలం జీవుడు అగ్నికి హవిస్సులు అర్పిస్తాడు. జీవుని మరణానంతరం అతని శరీరాన్నే అగ్నికి హవిస్సుగా పుత్రుడు సమర్పిస్తాడు.

శరీరంలోని ధాతువులన్నీ నిరాహారంగా దహించి శోషించడానికి మూడు రోజులు పడుతుంది. అప్పుడే అస్తిసంచయనం జరుగుతుంది. భీష్ముడు అష్టమినాడు శరీరత్యాగం చేస్తే శోషణ ఏకాదశి నాటికి పూర్తయింది.

బిడ్డ పుట్టడం కోసం, పుట్టిన తర్వాత అతడి ఆరోగ్యం కోసం ఎన్నో ఉపవాసాలు చేసిన తల్లి మరణానంతరం మూడు రోజుల పాటు ఆహారం లేకుండా అగ్నిలో శోషణకు గురవుతుంది. అప్పుడు ఆమె పడే బాధ బిడ్డడిని ఎలా కదిలిస్తుందో బాపు గీసి చూపారు.

అన్ని వైపులా చుట్టుముడుతున్న అగ్నికీలలలో కమిలిపోతున్న తల్లి ముఖం చూడలేక శిశువు బాష్పధారలతో వాటిని ఆర్పడానికి చూస్తున్నాడు. 'కన్నీళ్లకు చితిమంటలారవు' అని కవులు చెప్పినట్లు అది వృథాప్రయత్నమే. ఎంత గొప్పవారైనా ప్రాకృతిక విషయాలకు లోనుగాక తప్పదు.

శరీరం మొత్తాన్ని చూపకుండా కేవలం మొహాన్ని మాత్రమే చూపడంలో బాపుగారి ఆంతర్యం ఏమిటంటే – అన్ని వైపులా మంటలు ఎగసిపడి, కపాలం పగలడమే దహనసంస్కారంలో ముఖ్యఘట్టం.

అన్నద్వేషం పుడితే మనుగడకే ప్రమాదం. వేవిళ్ల సమయంలో ఆమెకు అన్నం వాసన సైతం పడదు. అంటే మృత్యుముఖంలోకి వెళ్లినట్లే కదా. ఏదో ఒకటి తినకపోతే ప్రాణం నిలవదని-తనది కాదు, లోపల వున్నవాడి ప్రాణం- కతుకుతుంది. చేదు, వగరు ఔషధాలు సేవిస్తుంది. అవి తింటే కడుపులో, గుండెల్లో మండుతుంది. ఇదంతా దేనికోసం? బయటకు వచ్చి గుణవంతుడిగా తేలతాడో లేదో తెలియని, పరిచయం లేని ఒక జీవి కోసం తల్లి యిన్ని కష్టాలు పడుతుంది.

ప్రసవం తర్వాత కూడా తిండి విషయంలో నియమాలు కొనసాగుతాయి. పిల్లవాడి ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకుని అనేక తిండిపదార్థాలను నిషేధించవలసి వస్తుంది. కాశీలో వదిలేసిన శాకం విందులో కనబడితేనే మనసు పీకుతుంది. ఒక్క శాకానికే మన కిలా వుంటే మరి తల్లి ఎన్ని వదులుకుంటోందో! రసేంద్రియమైన నాలుకను అదుపులో పెట్టుకుని కటువైన కారపు పదార్థాలు ఎన్ని సేవిస్తోందో!

ఆ భావం వ్యక్తీకరించడానికి బాపు ఆమె అరచేతిలో మండుతున్న హాలాహలాన్నే పెట్టారు. ఆమెను శివమూర్తిని చేశారు. నుదుటిపై విబూది, కొప్పులో నెలవంక, చేతికి నాగాభరణం ఆమెకు అమర్చి లోకక్షేమం కోసం కాలకూటాన్ని సేవించిన పరమశివుణ్ని స్ఫురింపచేశారు. కనురెప్పల్లో, ముఖకవళికల్లో ప్రస్ఫుటమౌతున్న తల్లి బాధను శిశువు గుర్తిస్తున్నాడా? లేదే, తినుతిను అన్నట్లు ఆమె చేతులను నోటిదాకా తీసుకెళ్లడానికి ప్రయత్నిస్తున్నాడు. వాడికి యిది ఆటగా వుంది. అయినా చంద్రుని వంటి చల్లని మనసున్న తల్లి దానికి నొచ్చుకోవటం లేదు.




ఇది అది అనకుండా అన్నిరకాలైన చేదు, కషాయాలూ
తినడం తాగడం చెయ్యవలసి వచ్చింది నాకు. అందుకు ప్రతిగా
ఈ మాతృపిండాన్ని నీకు సమర్పిస్తున్నాను



గర్భాన్ని ఆవరించిన చీకటి నుండి తేజోమయమైన లోకంలోకి వచ్చిన శిశువు శరీరంలోని మాలిన్యాలను క్షాళన చేసి, అతని అవయవాలను చైతన్యవంతం చేసి ప్రాణాన్ని నిలబెట్టగలిగిన ద్రవం తల్లి స్తన్యమే. అందుకే ఆమె అమృతమూర్తి. గృహిణి మాతృమూర్తిగా మారగలగడానికి వీలుగా గర్భిణిగా వుండగానే ఆమెలో క్షీరగ్రంథులు తయారవుతాయి, చర్మం మందంగా తయారవుతుంది, ఒళ్లు ఉబ్బుతుంది.

స్త్రీకి సిగ్గు సహజలక్షణం, కానీ బిడ్డ పుట్టి ఆమె తల్లిగా మారినపుడు పిల్లవాడి ఆకలి తీర్చడం కోసం స్వాభిమానాన్ని సైతం పక్కకు పెట్టి బహిరంగంగా స్తన్యం యివ్వడానికి వెనుకాడదు. ఆ అలుసు తీసుకుని శిశువు నిరంతరం ఆమెను పాలకై వేధిస్తూ వుంటాడు. ఆమె ఒంటరిగా వుందా, పదిమందిలో వుందా, యిది పగలా, రాత్రా, తనేమైనా తిందా ఒంట్లో ఓపిక వుందా, లేదా అన్న ఆలోచన లేకుండా నిరంతరం ఆమె గుండెలపైకి ఎగబాకుతాడు. స్తన్యం కోసం ఏడ్చి ఆమెను అల్లరి పెడతాడు.

ఇలా వేధించినందుకు ప్రతిగా నేను నీకు మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను అనే యీ శ్లోకానికి బాపు వివశురాలై పాలిస్తున్న మహిళను చిత్రీకరించారు. పైన సూర్యబింబం, చంద్రబింబం కలిసి పెద్దగోళంగా మారి ఆమె నడుంపై భారం పడినట్లు చూపి, రాత్రింబవళ్లు వేదనకు గురవుతున్నట్లు చూపారు. అస్తవ్యస్తంగా వున్న ఆమె కాలుచేతులు, విరబోసి వున్న ఆమె జుట్టు ఆమె శుష్కస్థితిని చూపుతున్నాయి. స్త్రీని అసభ్యదృష్టితో చూసేవారికి యీ బొమ్మలను చూపినపుడు మాతృదేవతగా ఆమె స్థానం ఎంత ఉన్నతమైనదో తెలిసివస్తుంది.

అహర్నిశం తు యన్మాతుః స్తనపీడా మదా మహం
తస్యా నిష్క్రమణార్థాయ మాతృపిండం దదామ్యహం

రాత్రి పగలు అన్న తేడా లేకుండా నాకు నీ స్తన్యాన్ని ఇవ్వమని
వేధించినందుకు ప్రతిగా నీకు
ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను



రాత్రి మూత్ర పురీషాభ్యాం భిద్యతే మాతృకర్పటా
తస్య నిష్క్రమణార్థాయ మాతృపిండం దదామ్యహం

రాత్రిపూట మలమూత్రాలతో నీ ప్రక్క తడిపి
నీకు సుఖం లేకుండా చేసినందుకు ప్రతిగా
ఈ మాతృపిండాన్ని నీకు సమర్పిస్తున్నాను

పాలకు వేళ లేనట్లే శిశువుకు మలమూత్ర విసర్జనకు కూడా వేళ లేదు, స్థల స్పృహ లేదు. తల్లి ఎక్కడికైనా వెళదామని తయారయి బిడ్డడిని అక్కున చేర్చుకుని ముద్దు చేయబోతే చీర తడిపేస్తాడు. అయినా తల్లి కోప్పడదు. వాణ్ని శుభ్రం చేసి, తనను శుభ్రం చేసుకుని మళ్లీ పడుక్కోబెడుతుంది. పగలైతే వెంటనే శుభ్రపరచడం వీలుపడుతుంది. మరి రాత్రివేళ నిద్రపోతూండగా ఆమె పక్క పాడు చేస్తాడు. దుప్పటి, పరుపు తడిసి ఆమెకు నిద్రాభంగమై మెలకువ వచ్చేస్తుంది. శుభ్రం చేసి, పక్కలు మార్చి నిద్రకు ఉపక్రమించాలి. ఆరోగ్యంగా వున్నపుడే యిలా వుంటే యిక అనారోగ్యం పాలైతే పడే అవస్థ చెప్పనలవి కాదు.

ఈ దురవస్థను చూపడానికి బాపు తల్లి శరీరాన్ని ఆ ద్రవాల్లో ముంచెత్తారు. కేవలం ముక్కు, తల మాత్రమే బయటకు కనబడుతున్నాయి. ఆ పరిస్థితిలో కూడా బిడ్డను వాటికి దూరంగా వుంచడానికి పైకి ఎత్తి పట్టుకుంది. ఆమె అరచేతుల్లో హాయిగా నిద్రపోతూనే వాడు తన పని తాను కానిచ్చేస్తున్నాడు. ఆమె వేళ్ల ద్వారా ఆ చుక్కలు కారుతున్నాయి. అయినా ఆమె మోములో చికాకు లేదు. ప్రశాంతతే తాండవిస్తోంది.

తండ్రి బిడ్డకన్నా వేరు, కానీ బిడ్డ తల్లిలో అంతర్భాగమే. వెలుపటికి వచ్చినా ఆ బంధం తెగదు. బాల్యంలో అనుభవించిన మాతృస్పర్శ జీవితాంతం తియ్యటి జ్ఞాపకంగా నిలిచిపోతుంది, సేద తీరుస్తుంది, స్వాంతన కలిగిస్తుంది.

కళాశాలల్లో యీ పద్యాలను బొమ్మలతో సహా సిలబస్‌గా పెట్టాలి. దీనికి మతం ఆపాదించవలసిన పని లేదు – సర్వప్రాణులకు తల్లి పూజనీయ కాబట్టి!



మాఘే మాసి నిదాఘేచ, శిశిరాతప దుఃఖితా
తస్యా నిష్క్రమణార్థాయ, మాతృపిండం దదామ్యహం

చాలా దీర్ఘమైన మాఘమాస రాత్రులందు శిశిరాతపాన్ని
దుఃఖాన్ని అనుభవింపచేసినందుకు ప్రతిగా ఈ మాతృపిండాన్ని
నీకు సమర్పిస్తున్నాను

సాధారణంగా గ్రీష్మానికి అన్వయమయ్యే 'నిదాఘేచ' పదాన్ని వ్యాసుడు దీనిలో మాఘమాసానికి అన్వయించారు. దీర్ఘమైన మాఘమాస రాత్రులలో చలిని తట్టుకుంది తల్లి. లోకంలో ఎవరి ఉపకారానికైనా ప్రత్యుపకారం చేసి ఋణం తీర్చుకోవచ్చు, పితృఋణం సైతం తీర్చుకునే మార్గం చెప్పిన వేదం, మాతృ ఋణం తీర్చుకోగలిగే ఉపాయం చెప్పలేదు. ఎందుకంటే తల్లి ఋణం తీర్చుకోలేనిది. సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు సైతం తల్లి పట్ల బాధ్యత నెరవేర్చినవారే.

స్త్రీ తన భర్తతో అద్వైతభావాన్ని పొంది 'మేమిద్దరం ఒక్కటే' అనే భావనతో వుంటుంది. అందుకే తనలో ప్రవేశించిన పురుషతేజస్సును ఆమె శరీరం అంతర్భాగంగానే గుర్తించి, దాన్ని రక్షించుకుంటుంది. 'నువ్వు నా పాలిట సృష్టికర్తవు, స్తన్యమిచ్చి, గోరుముద్దలు తినిపించిన స్థితికర్తవు, జో కొట్టి నిద్రపుచ్చి స్వల్పకాలిక లయానుభూతి కలిగించిన ప్రళయకర్తవు. నువ్వు నా కోసం శిశిరతాపాన్ని భరించావు. చలికి వణికావు. దుఃఖాన్ని అను భవించావు. తాపాన్ని భరించలేక ఏదైనా ఉపాయాన్ని అవలంబిస్తే దాని వలన నా ఆరోగ్యం దెబ్బ తింటుందేమోనని జంకావు. నేనేం చేస్తే నీ ఋణం తీరుతుందమ్మా' అని ఆక్రోశిస్తున్న శిశువు చలికి ముడుచుకున్న తల్లికి అరచేతిలో వేడిని చూపి కొంతైనా ఆమె బాధ బాపడానికి ప్రయత్నించినట్లు బాపు చిత్రీకరించారు.

'దరిద్రంలో సైతం ఇవ్వడమనేది మా అమ్మ దగ్గరే నేర్చుకున్నాను.' అన్నారు యీ శ్లోకాలను అనువదించిన ముళ్లపూడి వెంకటరమణగారు. అజరామరమైన బాపు-రమణల మైత్రి యీ పుస్తకంలో కూడా కానవస్తుంది.



క్షుత్తృష్ణాం వ్యాకులే పుత్రే, యన్నం నీరం ప్రయచ్ఛతి
తస్యా నిష్క్రమణార్థాయ, మాతృపిండం దదామ్యహం

ఆకలితో అలమటించిన నాకు, తినడానికో తాగడానికో ఇచ్చి
రక్షించినందుకు ప్రతిగా
నీకు ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను

శిశువు అర్భకుడు. వాడికేం కావాలో వాడికే తెలియదు. తల్లి గ్రహిస్తుంది. ఎప్పుడు ఆకలి వేస్తుందో, ఎప్పుడు దాహం వేస్తుందో తెలుసుకుని సమయానికి సమకూరుస్తుంది. వాడికి తగినవిధంగా ఆహారాన్ని తయారుచేసి యిస్తుంది. అది తన బాధ్యతగా భావించి, దానిలో లోటు జరిగితే అపరాధం చేసినట్లు భావిస్తుంది. పని మీద బయటకు వెళ్లి యింటికి తిరిగివచ్చిన తల్లికి గుమ్మంలో పిల్లవాడు ఎదురై ఆకలేస్తోందమ్మా అంటే విపరీతంగా బాధపడి, తనను తాను తిట్టుకుని గబగబా వండి పెడుతుంది. తన ఆకలి సంగతి చూసుకోదు. చివరకు ఆమె విస్తరి ముందు కూర్చునేసరికి ఆ పిల్లవాడే ఎన్నో అవాంతరాలు కల్పిస్తాడు. అయినా ఆమె విసుగు చెందదు.

ఎదుటి వారి నుండి ఏ ప్రయోజనాన్ని అపేక్షించకుండా చేసే గుణం – ప్రేమ. ఎదుటివారి అభ్యున్నతి కోసం సర్వస్వం వదులుకునే గుణం – త్యాగం. ప్రేమ, త్యాగం రెండూ కలిసిన మూర్తి – మాతృమూర్తి మాత్రమే. బాపు బొమ్మలో చమత్కారం ఏమిటంటే బిడ్డకు ఆకలేస్తే ఏడుస్తున్నది బిడ్డ కాదు, అమ్మ! భాగవతంలో కృష్ణుడికి ఆకలి వేస్తే యశోద రోదిస్తుంది. ఆమె కన్నీటి బిందువు పిల్లవాడికి బొట్టుగా అమరింది. ఆజ్ఞాచక్రంపై బొట్టు వుండడం మంగళప్రదం. నాకోసం బాధపడే అమ్మ వున్నంత కాలం నేను క్షేమమే అని బిడ్డ గ్రహిస్తున్నాడు. అందుకే చేతులు జోడించి తల్లికి నమస్కరిస్తున్నాడు.

'నన్నింతటివాణ్ని చేసిన నీకు నేను యీనాడు యివ్వగలిగేది ఒక్క పిడచ మాత్రమే. కాకులు, కుక్కలు సంచరించే ఈ శ్మశానంలో రుచీ, పచీ లేని పిండం పెడితేనే నువ్వు సంతోషపడుతున్నావే!' అంటున్నాడు.



అల్పాహారాచ యా మాతా యావత్ పుత్రోస్తి బాలకః
తస్యా నిష్క్రమణార్థాయ మాతృపిండం దదామ్యహం

అందరు పిల్లలూ తినగా మిగిలిన దానినే
అల్పాహారంగా స్వీకరించిన నీకు
ప్రతిగా ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను

సృష్టిలో మారగలగినది స్త్రీ శరీరం ఒక్కటే. బిడ్డకు కావలసిన అన్ని ధాతువులు, కడుపులో బిడ్డ తేలియాడేందుకు తయారయే ద్రవం, ప్రసవసమయంలో రక్షణకు అవసరమైన ఉమ్మనీరు వీటన్నిటినీ ఆమె శరీరం తను తినే ఆహారం నుండే తయారుచేసుకోగలుగుతుంది. తల్లి యింత కరుణ చూపుతున్నా లోపలి పిండానికి అదేమీ పట్టదు. తనకు కావలసినదంతా అమ్మ ఆహారం నుండి జలగలా, పరాన్నభుక్కులా నిర్దాక్షిణ్యంగా గుంజుకుంటుంది. రక్తహీనత పెరిగితే ఒక్కో సమయంలో తల్లి ప్రాణానికే గండం, అయినా ఆ పిండానికి అది అనవసరం.

బిడ్డను పోషించే క్రమంలో తన కడుపు సంగతి చూసుకోదు. కలాం తన ఆత్మకథలో రాసుకున్నారు – 'యుద్ధసమయంలో, రేషన్ రోజుల్లో ఓనాడు నేను యింట్లో చేసిన రొట్టెలన్నీ తినేశాను. అమ్మకేమీ మిగల్చలేదని మా అన్న తిట్టాడు. అమ్మ నడిగా–'నువ్వు తినలేదా?' అని. 'నీ బొజ్జ నిండితే నా బొజ్జ నిండినట్లే' అంది అమ్మ. నాకప్పుడు అర్థం కాలేదు. పెద్దయ్యాక యిప్పుడు తెలిసింది మాతృత్వం అంటే ఏమిటో..' అని. అందరు తల్లులూ అలాటి వారే. ఏ బిడ్డా 'అంతా నాకు పెట్టేస్తున్నావే, అమ్మా నీకేమైనా మిగుల్చుకున్నావా?' అని అడగడు. అలా అడగాలని తల్లి ఆశించదు కూడా.

బాపు తన యీ బొమ్మలో తల్లికి చిరుముద్ద పెడుతున్న పిల్లవాణ్ని, ఆ మాత్రానికే అరమోడ్పు కన్నులతో మురిసిపోతున్న తల్లిని చిత్రీకరించారు. ఆ ముద్ద పిల్లవాడి స్వార్జితం కాదు, తను చేసిపెట్టినదే. అయితే తనను గుర్తుపెట్టుకుని తినిపిస్తున్నందుకు అదే అక్షయంగా భావించి మాతృమూర్తి పొంగిపోతోంది.

పుత్రే వ్యాధి సమాయుక్తే, శోకార్తా జనన్యపిచ,
తస్యా నిష్క్రమణార్థాయ మాతృసింహం దదామ్యహం ||

నేను వ్యాధితో బాధ పడుతున్నపుడు బాధపడేదానివి నువ్వే
అందుకు ప్రతిగా నీకు ఈ మాతృసింహాన్ని సమర్పిస్తున్నాను

అమ్మను చెట్టుతో పోల్చవచ్చు. చెట్టు మనిషికి అనేక విధాల ఆశ్రయాన్నిస్తుంది. నీడలో ఆడుకోనిస్తుంది, ఫలాలిచ్చి సేద తీరుస్తుంది, యింటికి కలప నిస్తుంది, వంటింటికి వంటచెరుకు నిస్తుంది, రోగనివారణార్థం మందుల నిస్తుంది, అంత్యదశలో కట్టెల నిస్తుంది.

తల్లి బిడ్డకు ఆహారం సమకూర్చడమే కాదు, అనారోగ్యం పాలయినప్పుడు శుశ్రూష చేస్తుంది. బాధపడుతుంది. మొక్కులు మొక్కుతుంది, ఉపవాసాలు చేస్తుంది. స్త్రీకి భర్త, బిడ్డ రెండు కళ్లు. ఎవరికి కష్టం వచ్చినా తట్టుకోలేదు. ఇద్దరికీ సర్దిచెప్పడంలోనే ఆమె కాలం గడిచిపోతుంది. బిడ్డ ఎంత పెద్దవాడైనా తన చేత్తో తిండి పెట్టాలని ఆరాట పడుతుంది. తినకపోతే ఆరోగ్యం బాగాలేదేమోనని బెంగటిల్లుతుంది.

మొగ్గగా వున్నపుడు లేని సువాసన పువ్వుగా వికసించినప్పుడు వచ్చి చేరుతుందని బసవ పురాణంలో చెప్తారు. అలాగే కన్య ఒక గృహిణిగా, తల్లిగా ఎదిగినప్పుడు ఆమెకు అంతులేని సహనం వచ్చి చేరుతుంది.

బాపు యీ బొమ్మలో శిశువును బిగించిన గుప్పిళ్లతో, మూసిన కళ్లతో చిత్రీకరించి వాడి వ్యాధిగ్రస్తతను సూచించారు. తల్లి పడే వేదనను కన్నీళ్లతో చూపారు.

సమాజానికి మనం చేసే నిజమైన సేవ ఏమిటంటే నిరుపేద గర్భిణులకు పోషకాహారం అందించడం, కుటుంబసభ్యులకు నచ్చచెప్పి వారి చుట్టూ ఆహ్లాదకరమైన వాతావరణం సమకూర్చడం! ప్రసవానంతరం శిశువులకు వ్యాధినిరోధకాలను యిచ్చి వారికి ఆరోగ్యం, తల్లులకు ఆనందం కలిగించడం!



గాత్రభంగో భవేన్మాతుః మృత్యురేవ న సంశయః
తస్యా నిష్క్రమణార్థాయ, మాతృపిండం దదామ్యహం

శరీరం కళతప్పి మృత్యుముఖంలోకి వెళ్ళి తిరిగి వస్తుంది
అందుకు ప్రతిగా నీకు ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను

భాగవతంలోని 'కపిలగీత'లో కపిలుడు దేవహూతికి గర్భధారణ గురించి చెప్పిన విషయాలన్నీ ఆధునిక ప్రసూతి వైద్యనిపుణులు ఆమోదిస్తున్నారు. భాగవతం వ్రాసిన వేదవ్యాసుడే వాయుపురాణంలో అంతర్భాగంగా యీ షోడశశ్లోకాలను చెప్పి గర్భధారణలోని క్లేశాలను ప్రస్తావించి, మాతృఔన్నత్యాన్ని మనకు చాటి చెప్తున్నాడు.

రక్తంలో హెమోగ్లోబిన్ తగ్గితే లోపలి బిడ్డకు మరీ తగ్గితే తల్లికీ ప్రమాదమే. ప్రసూతి గదిలో స్త్రీ పడే బాధను ఎఫ్‌టిపి సిండ్రోమ్‌గా వైద్యులు పిలుస్తారు. ఫియర్ (భయం), టెన్షన్ (ఆందోళన), పెయిన్ (బాధ) కలగలిపిన ఆ సమయంలో ఆమె ఏ పరాదేవతకన్నా తక్కువ కాదు. బాధ నడుములోంచి, కడుపులోకి పాకి, కిందకు ప్రసరిస్తూండగా, పాదాలతో మంచాన్ని నిగడదన్ని, కంఠంలో ఊపిరిని బంధించి, చేతులతో అందినదాన్ని గట్టిగా పట్టుకుని, విచిత్రధ్వనులు చేస్తుంది. తనకు రక్తపుపోటు పెరుగుతుందేమో, సున్నితమైన అవయవాలు దెబ్బ తిని రక్తస్రావం జరుగుతుందేమో అనే ఆందోళన చెందుతుంది. బిడ్డడికి ఏమైనా అవుతుందేమోనన్న భయం వెంటాడుతుంది.

గర్భకోశం నుండి వెలుపలికి వచ్చే నాలుగు అంగుళాల దూరం దాటడం మనిషి జీవితంలో అత్యంత స్వల్పమూ, అత్యంత ప్రమాద భరితమూ అయిన ప్రయాణం. ఈ పయనంలో ఎవరికైనా ముప్పు వాటిల్లవచ్చు, కొన్ని సందర్భాల్లో యిద్దరికీ వాటిల్లవచ్చు. తను పుట్టిన రోజును మృత్యుముఖంలోకి వెళ్లి తిరిగివచ్చిన అమ్మ మళ్లీ పుట్టిన రోజుగా భావించి జరుపుకునేవారు ధన్యులు. బాపు బొమ్మలో కళాహీనమైన మాతృమూర్తి, ఆమెకు హారతి పడుతున్న శిశువు కానవస్తారు.



యమద్వారే మహా ఘోరే ఖ్యాతా వైతరిణీ నదీ,
తస్యా ఉద్ధరణార్థాయ, మాతృపిండం దదామ్యహం

యమద్వారం ముందు మహాఘోరమైన వైతరణీ నది
ఉంటుంది. అది నువ్వు దాటడానికి వీలుగా
నేను ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను

ఈ శ్లోకంలో రెండవ పాదంలో 'ఉద్ధరణార్థాయ' అని వస్తుంది. గమనించండి. ఇప్పటివరకు గీసిన బొమ్మల్లో తల్లి చేతుల్లో శిశువు వున్నాడు. కానీ దీనిలో శిశువు చేతిలో తల్లి వుంది. మరణానంతరం వైతరణీ నదిని దాటడానికి తల్లికి తోడ్పడవలసిన వాడు తనయుడొక్కడే. ఒక వ్యక్తి నుండి అమ్మను తీసుకుని వెళ్లిపోవడానికి జగన్మాత కూడా సంశయిస్తుంది. అందుకే గోమాత, భూమాత, ప్రకృతి స్వరూపిణియైన లోకమాత – అనే ముగ్గురమ్మలను ప్రసాదించి మరీ అమ్మను తీసుకుపోతుంది. నీ తల్లి స్థానంలో వీరిని సేవించుకో అని ఆదేశమిస్తుంది.

అంత్యేష్టి సంస్కారంలో చేతులు కలిపికడతారు. కాలి బొటనవేళ్లు కలిపి కట్టడం చేత ఒక పాదంపై మరొక పాదం చేరుతుంది. శాశ్వతనిద్ర చేత వదనం నిర్లిప్తమవుతుంది. బాపు వాటిని సూచించారు.

బాపుగారు గీసిన బొమ్మలన్నీ ఒక యెత్తు, యీ బొమ్మలు ఒక యెత్తు. ఈ బొమ్మలకై బాపుగారు పారాడే తన పసితనంలోకి వెళ్లి గీసినట్లు నాకు తోస్తుంది.

బాపుగారు దేహం విడిచి ఉత్తమలోకాలకు వెళుతున్నపుడు వ్యాసభగవానుడు ఆయనకు దర్శనమిచ్చి, అభినందించి, ఆశీర్వదించి వుంటారని నేను చదివిన చదువు సాక్షిగా నాకు గట్టి నమ్మకం.

ఈ పుస్తకానికి విస్తృతప్రచారం కలిగిస్తే సమాజంలో మహిళల పట్ల గౌరవాభిమానాలు పెరిగి, తలిదండ్రులను వృద్ధాశ్రమాలకు తరలించే ఆలోచనాధోరణిలో మార్పు వచ్చి సమాజం మరింత సంస్కారవంతంగా మారుతుందని నా విశ్వాసం.



(15.12.1934) - (31.08.2014)

# అశ్రుతర్పణాలు...

కొంటె చిత్రాలు...

పవిత్ర దేవీదేవతా చిత్రాలు...

ఆహ్లాద చలనచిత్రాలు...

బాపు అనన్య సామాన్య ప్రతిభకు దర్పణాలు !

తెలుగు జాతి సంపద 'బాపు'కు యివే అశ్రుతర్పణాలు !!

"ప్రీణాతి యః సుచరితైః పితరం స పుత్రో, య ద్భర్తురేవ హిత మిచ్ఛతి తత్కళత్రమ్
తన్మిత్ర మాపది సుఖే చ సమక్రియం యత్, ఏతత్త్రయం జగతి పుణ్యకృతో లభంతే"
- భర్తృహరి నీతి శతకం 60

తన సత్కార్యములచే తల్లిదండ్రులకు ప్రీతి చేయువాడే పుత్రశబ్దానికి తగినవాడు. భర్త హితమును కోరునది, చేయునదే భార్య. కష్టసుఖాల్లో యేకరీతిగా నున్నవాడే మిత్రుడు. ఇల్లాంటివారు పూర్వపుణ్యవశాననే లభిస్తారు.

"అతిథి ర్బాలకః పత్నీ, జననీ జనక స్తథా,
పంచైతే గృహిణః పోష్యాః, యితరే చ స్వశక్తితః" - పంచతంత్రం

అతిథి, పిల్లలు, భార్య, తల్లి, తండ్రి యీ ఐదుగురు గృహస్తు తప్పక పోషించవలసినవారు.
తక్కినవారిని తన శక్తి ననుసరించి పోషించవచ్చును.

"యం మాతాపితరౌ క్లేశం, సహేతే సంభవే నృణామ్,
న తస్య నిష్కృతిః శక్యా, కర్తుం వర్షశతై రపి " - మనుస్మృతి 2-227

శిశువు జన్మించినపుడు తల్లిదండ్రులు వహించే శ్రమకు ప్రతిఫలం యేమియిచ్చిన్నీ తీర్చజాలము.
నూరేళ్లు తలిదండ్రులకు సేవగావించిననూ ఆ ఋణము తీరదు.

సృష్టిలోని తియ్యని పదం అమ్మ!
దేవుడు కల్పించిన కమ్మని బంధం అమ్మ!
ప్రాణం పోయే స్థితిలో మరొక ప్రాణికి జన్మనిచ్చే దేవత అమ్మ!
మనిషికి తప్ప ఆ పరమశివునికి కూడా లేని వరం అమ్మ!!

అమ్మ ఒక వైపు, దేవతలంతా ఒక వైపు
నీవు ఎటువైపు అని అడిగితే నేను అమ్మవైపే !



కీ॥శే॥ జయంతి లక్ష్మి నృసింహ శాస్త్రి (1903 - 77)
కీ॥శే॥ సూర్యకాంతం (1909 - 80)

బిడ్డకు జన్మనిచ్చే ముందు, జన్మ నిచ్చే సమయంలో, ఆ తర్వాత పెంచే సమయంలో ఒక స్త్రీ ఎన్ని కష్టాలనుభవిస్తుందో స్మరిస్తూ వేదవ్యాసుడు రాసిన "మాతృషోడశి"ని బాపుగారి బొమ్మలతో, చాగంటి వారి వ్యాఖ్యానంతో "మాతృవందనం" పేర జయంతి చారిటబుల్ ఫౌండేషన్ మీకు అందిస్తోంది.

మాతృవందనం అంటే తల్లికి మాత్రమే నమస్కారమని మేము అనుకోవటం లేదు. జగతికే మాతాపితరులైన పార్వతీపరమేశ్వరులు వాక్కు, అర్థము వలే విడదీయరానివారని కాళిదాసు ఉవాచ. మా తలిదండ్రులూ అటువంటివారే అనీ, యీ వందనం వారిద్దరికీ చెందుతుందని నమ్ముతున్నాం.

తండ్రి అంటే శిక్షణ, క్రమశిక్షణ - తల్లి అంటే కరుణ
తండ్రి అంటే ఆలన, పాలన - తల్లి అంటే లాలన
శిశువుకు యివన్నీ కావాలి. వీటిలో ఏది తగ్గినా వ్యక్తిత్వవికాసం అసంపూర్ణమే.
ఏ తలిదండ్రులైనా తమ పిల్లల శ్రేయస్సు కోసం తపిస్తారు, శ్రమిస్తారు.
మా తలిదండ్రులూ అందుకు భిన్నం కాదు.

పెద్ద కుటుంబం, బహుసంతానం, వచ్చేపోయే అతిథి అభ్యాగతుల సేవ, వారాల తరబడి ఉండిపోయే బంధువుల బాగోగులు చూసుకోవడం, విరామమెరుగని వంటింటి అజమాయిషీ, పనివాళ్ళెందరు వున్నా తనే బాధ్యత వహించడం, దక్షతతో బయటి వ్యవహారాలు చక్కపెట్టే భర్తకు, పిల్లలకు మధ్య సంధానకర్తగా వ్యవహరించడం - ఆనాటి కుటుంబాలన్నిటిలో గృహిణిది యిదే కథ. మా అమ్మదీ అంతే. అయితే మా తమ్ముడు దీర్ఘ అనారోగ్యం పాలయినపుడు పుష్కరకాలం పాటు చేసిన సేవ ఆమెలో ఒక "ఫ్లారెన్స్ నైటింగేల్"ను మాకు చూపింది. ఏడుగురిని కని, పెంచడంతో బాటు జీవితవిలువలను నేర్పించిన మా తలిదండ్రుల ఋణం ఏమిచ్చినా తీర్చుకోలేనిది.

'ఆత్మావై పుత్ర నామాసి' అని ఆర్యోక్తి. మా ద్వారా, మా సంతానం ద్వారా వారి స్మృతి, నైతిక విలువల పట్ల నిబద్ధత ఎప్పటికీ సజీవం, సచేతనం. మన ఉనికికి, మనుగడకు మూలకారణమైన తలిదండ్రులను జీవించి వుండగా సేవించుకున్నవారే ధన్యులనే భావన నేటి సమాజంలో పరిఢవిల్లాలనే ఆకాంక్షతో, మాకు మా తల్లిదండ్రుల వలె యితరులకూ తమ మాతాపితరులు పూజనీయులనే ఎఱుకతో యీ చిన్న పుస్తకం వెలువరించే వేళ మా తలిదండ్రులందించిన స్ఫూర్తిని భక్తితో, బాధ్యతతో గుర్తు చేసుకుంటున్నాం.

**జయంతి సూర్యప్రకాశం**

**జయంతి సుబ్బారావు**